# పీఠిక.

రత్నపరీక్షరచించినది భైరవకవి. ఇతఁడు శ్రీరంగమహాత్త్వము, లక్షణపీఠిక యను గ్రంథములను కూడ రచించెను. భైరవకవి శ్రీమదాంబికానాథ కృత్తుఁడు. గౌతమగోత్రుఁడు. గౌరనామాత్యునికుమారుఁడు. హరిశ్చంద్ర, నలనాథ చరిత్రములు ద్విపదలుగా వ్రాసినగౌరనకవియు గౌతమగోత్రుఁడును భైరవకవి కించుమించుగ సమకాలికుఁడు నగుటవలనను నిరువురు తండ్రికుమారు లని చరిత్రకారు లూహింప నవకాశము కలుగుచున్నది. ఈవిషయము నవుననుటకుఁ గాదనుటకుఁ దగిన ప్రమాణము లింకను సమగ్రముగా లభింపలేదు.

భైరవకవిలాక్షణికుఁడు. ఇతనికవిత ధారాశుద్ధియు మార్దవమును గలిగి మనోజ్ఞముగా నుండును. రత్నపరీక్ష అగస్త్యుఁడు చెప్పిన సంస్కృతగ్రంథమును బట్టి వ్రాసితి నని కవి చెప్పుకొనినాఁడు. రత్నపరీక్ష ముదిగొండల వీరేశ్వరుఁ(వీరభద్రుఁ)డు అను నారాధ్యబ్రాహ్మణున కంకితము గావింపఁబడెను. అతఁడు నిఖిలవిద్యాపారీణుఁ డఁట. కవికాలము గ్రహించుటకుఁ దగినయాధారములు శ్రీరంగమహాత్త్వము నుండి తీసికొనవలసియున్నది.

సీ-గీ. పరగ నేమంత్రి భుజబల ప్రకటశౌర్య
దానసత్కీర్తు లప్రతిమానమహిమ
గాంచె నిమ్మడి సైపఖానాధిరాజ్య
భారధుర్యుండగు విట్ఠలప్రభువరుండు. (శ్రీరంగమహాత్త్వము)

ఈపద్యమువలనఁ బైగ్రంథము నొందిన రాఘవమంత్రి యన్న విట్ఠలప్రభువు. ఇమ్మడి యను నామాంతరముగల ప్రౌఢరాయని రాజ్యకాలమున ౧౪౨౩. ౧౪౪౭ (క్రీ. శ.) లోనుండెఁ గాన భైరవకవియు నించుమించుగా నాకాలమువాఁడని ఆంధ్రకవుల చరిత్రమున వీరేశలింగముపంతులువారు వ్రాసి యున్నారు. రత్నపరీక్షయందు నవరత్నములు, వాని యాకారవిశేషములు, గుణదోషములు, ధరించుటవలన గలుగు శుభాశుభములు విరళముగాఁ జెప్పఁబడియున్నవి. సమస్తజనులకు సుబోధమగుటకై యీగ్రంథమునకుఁ గవిభావానుసారముగఁ దాత్పర్యము జతపఱచి స్ఖాలిత్యములు సంస్కరించి ప్రచురించితిమి.

ఇట్లు,
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.



శ్రీ రస్తు.

# రత్నపరీక్ష.

---

క. శ్రీ వెలయఁగఁ బద్యములను
బాసనవరత్నకుసుమపంక్తులపూజల్
గావించెద ముదిగొండల
శ్రీవీరేశునకు భక్తచింతామణికిన్. 1

క. ఆవీరేశ్వరుపేరిట
నావలకేదారపుత్త్రుఁ డని భక్తులు సం
భావింప నధికవిద్యా
ప్రావీణ్యుం డైన వీరభద్రుం డెలమిన్. 2

క. తన్నుఁ బ్రియమార వేఁడిన
మున్ను మునీంద్రుల కగస్త్యముని చెప్పినయా
సన్నుతమణిలక్షణములు
చెన్నుగఁ గ్రోడీకరించి చెప్పెదఁ దెలియన్. 3

క. భ్రమరాంబాదేవికృపన్
సముచితనిరవద్యహృద్యసాహిత్యకళా

క్రమవిమల*ప్రతిభామణి
క్రమవైభవశాలియైన గౌరనసుతుఁడన్. 4

క. భైరవుఁడ నుభయవిద్యా
పారీణుఁడ లోభిభవనభవభూమవ్యా
పారసవికారదుష్కర
ఘోరపిశాచము లడల్చు గుణభైరవుఁడన్. 5

వ. మఱియు నిఖిలజనవినుతనిజప్రభూతప్రభాపటల
నిరస్తసమస్తదురితస్తోమంబులగు నవరత్ననామం
బుల విశేషంబులగు తత్క్రమం బెట్టి దనిన 6

—నవరత్నముల నామాదికములు.—

క. కురువింద వజ్ర మౌక్తిక
వరమరకత శక్రనీల వైడూర్య మనో
హరపుష్యరాగ విద్రుమ
వరనుతగోమేధికములు నవరత్నంబుల్. 7

కురువిందము, వజ్రము, ముత్యము, మరకతము, ఇంద్రనీలము, వైడూర్యము, పుష్యరాగము, పగడము, గోమేధికము అని రత్నములు తొమ్మిదివిధముల నొప్పును.

క. రవి శుక్ర చంద్ర బుధులును
రవిసూనుఁడు కేతు వమరరాజగురుండున్

*ప్రతిభాసం, క్రమణుఁడమతిశాలి-అని పాఠాంతరము.

భువిసుతుఁడు సైంహికేయుఁడు
నవరత్నంబులకు వీరు నాథులు తలఁపన్. 8

సూర్యుఁడు, శుక్రుఁడు, చంద్రుఁడు, బుధుఁడు, శనైశ్చరుఁడు, కేతువు, బృహస్పతి, అంగారకుఁడు, రాహువు అనునీతొమ్మిదిమందియు (నవగ్రహములు) నవరత్నముల కధినాథులై యున్నారు.

ఆ. వజ్ర మౌక్తిక ప్రవాళాదికంబుల
భేదజాలము మణిభేదములును
వానిజననజాతివర్ణగుణంబులఁ
బ్రతతిఁ జేటపఱతు పరుసతోడ. 9

వజ్రము మౌక్తికము పగడము లోనగునవరత్నములలోఁ గల భేదములు గుణదోషములు వానిపుట్టుకలును వర్ణములును గూర్చి వివరముగాఁ దెలుపుచున్నాఁడను.

పద్మరాగలక్షణము.

క. పెక్కుతెఱంగులఁ గడుఁ బెం
పెక్కిన యామానికముల కెల్లను మొదలై
చొక్కమగు పద్మరాగము
లెక్కింప నమూల్య మఁట నిలింపుల కమరున్.10

వివిధములుగఁ జేరెన్నికఁగన్న నవరత్నములలో మొట్టమొదటిదిగా నెన్నఁదగినది పరిశుద్ధమగు పద్మరాగము. దానివిలువ యింతని నిర్ణయింప వలనుగాదు. అది దేవతలకే విశేషించి లభించుచుండును.

వ. అమృతశరీరాజంబులకుఁ దేజంబు లాలు గలుగుటం
జేసి పద్మరాగంబును సౌగంధికంబును గురువిం
దంబును మాంసగంధియు నీలగంధియు లాలు
గంధియు నను నామాంకితంబు లాలుగల నవి
యెట్టి వనిన. 11

పద్మరాగంబు లాలు తెలుంగులగు కాంతులతో నొప్పుచుం డును. వానివాని ప్రకాశవిశేషంబులఁబట్టి వానికిఁ బైఁజెప్పఁబ డినటు లాలుపేరులు గలవు. వానివాని స్వరూపవిశేషములు చెప్పుచున్నాఁడను.

సీ. ఉదయార్కబింబసముజ్జ్వలప్రభఁగల్గి
కరమొప్పు పద్మరాగంబు పొసలు
అసమానదాడిమీకుసుమమంజరిచాయఁ
గలిగి శోభిల్లు సౌగంధికంబు
సలలితమత్తకోకిల లోచనద్యుతి
నలరారు కురువింద మనెడి కెంపు
మంజీతశోణమాంసఖండంబుగతినున్న
మంద తేజం బగుమాంసగంధి

ఆ. నలుపు నెఱ్ఱఁదనము మిళితమై నెగడెడు
వాలుగలిగినదియు నీలగంధి
లాలు లేక కోమలం బనుసంజ్ఞలఁ
గ్రాలుకెంపు చాల రంగు లేక. 12

పద్మరాగములందుగల నాలుభేదములు వివరముగాఁ దెలుపుచున్నాను. ఉదయించుచున్న సూర్యునివంటికాంతితో నొప్పునది పద్మరాగ మనఁబడును. దానిమ్మపూవువంటి చిక్కనియెఱుపురంగుతో నొప్పారునది సౌగంధిక మనఁబడును. గండుకోకిల కన్నువలె నెఱ్ఱగానుండునది కురువింద మనఁబడును. కందేలుమాంసమువలె నెఱ్ఱగా నుండునది మాంసగంధి యనఁబడును. ఎఱుపుఁదనము నల్లఁదనము గలసి కానవచ్చునది నీలగంధి యనియు, అంతగా నెఱుపురంగులేక తెలతెలబోవు దానినిలాలు, లేక కోమలమని యందురు. ఇవి పద్మరాగముల లోని యంతర్భేదములు.

క. అసకృద్వికసితలోధ్ర
ప్రసవాశోకప్రసూనబంధూకలస
త్కుసుమద్యుతు లగువర్ణము
లెసఁగును గెంపులకు విలువ లెఱిఁగెడిచోటన్.

వికసించిన లొద్దుగపూవువలె, అశోకపుష్పమువలె, మంకెన పూవువలె మిగుల నెఱుపుచాయతోఁ గ్రాలు పద్మరాగములు శ్రేష్ఠములు. అవియే విలువగలవి.

ఆ. మఱియు లశున, పటల, త్రాసభిన్న, జర్ఝర, కర్క
శ, నీలము లనియెడు నాఱుదోషంబులు గలవు.
వాని తెఱం గెఱింగించెద. 14

పద్మరాగములకుఁ బైని పేర్కొనఁబడినవిధమున ఆఱుదోష

ములు ఆయాపేరులతోఁ గలవు. వానివానిరీతుల నెఱింగించు చున్నాఁడను.

### దోషనిదానములు.

సీ. పాలుపైఁ బూసిన లీల నుండెడు డాలు
లశునపటల మది లక్ష్మి జెఱచుఁ
బగిలినగతి రేకపై నున్నఁ ద్రాసంబు
కలహ మెప్పుడు దానఁ గలుగుచుండు
దునుకపోయినరీతిఁ దోఁచు భిన్నం బది
చయ్యన బంధుపక్షంబుఁ జెఱచుఁ
జిదుపప లైనయట్లోఁ జవినపటలంబు
ఘనశోకవనధిలో ముంచఁగఁ జేయుఁ
తే. జాలు పొరలున్న జర్ఝరసంజ్ఞ యగును
నర్కశం బది ప్రాణసంకట మొనర్చు
నీరు మగునది నల్లనై నెగడు డాలు
గలుగవల యిట్టి దోషములఁ గలిగెనేని. 1౫

పైని పాలుబూసినటులఁ దెల్లకప్పుతో నుండుట లశున మనబడును. అట్టి లశునదోషముగల పద్మరాగము ధరించినవానిని దరిద్రునిగఁ జేయును. పైని బగిలినటుల రేఖలు గానవచ్చుట త్రాస మనఁబడును. అట్టి పద్మరాగమువలన యజమానికి సదా గలహము ప్రాప్తించును. పైని చదునుగా నుండక తునుకపోయినటు లుండుట భిన్న మనఁబడును. ఆభిన్నదోషముగల పద్మరాగము ధరించినవానిబంధువుల నాశనము జేయును. పైని దున

కలుతునుకలవలెఁ గానవచ్చునది పటల మనఁబడును. అట్టి పద్మ రాగము దాల్చినవానికి విచారము కలుగఁజేయును. పైని బొరలు కానవచ్చుట జర్ఝర మనఁబడును. గడుసుబారియున్నఁ గర్కశ మనఁబడును. ఈరెండుదోషములుగల పద్మరాగము యజమానికిఁ బ్రాణాపాయము గలిగించును. నీలమనుదోషము నలుపురంగుగాఁ బద్మరాగమున్న కలుగును. దానిని కొనుట తగదు.

క. పెన్న మణియందు దోషము
లెన్నఁగ మతిరెండుమూఁడు నేర్పడి యున్నన్
గన్నుల నని ప్రాజ్ఞునఁ గను
గొన్నను గొఱకాదు పట్టి గోషవలుచ్చున్. 16

ఒక్కపద్మరాగమున కొకదోషమేగాక పూర్వోక్తదోషములు రెండుమూఁడేర్పడియున్నయెడల దానిని ప్రాజ్ఞునఁ గనులనైనఁ జూడరాదు. చూచినచో లేనిపోని యపాయములు చిక్కులు చూచినవానికిఁ గలిగి తీరును.

క. ధర పద్మరాగ మెందును
దొరుకదు కలియుగమునందుఁ దోఁచిన వ్రేగై
నిరుపమరుచి నిర్మలమగు
గురువిందపుఁ గెంపు గలదు కోరి ధరింపన్. 17

పద్మరాగము సాధారణముగాఁ గలియుగమున లభింపదు. దానికి బదులుగా ధరింపవలయునని తలంచినయెడలఁ బద్మరా

గము జాతిలోఁ జేరినదగు కురువిందము లభించును. దానిని ధరింపవచ్చును.

క. తులమెత్తు పద్మరాగము
వెలియఁగఁ జౌషష్టివేల దీనారంబుల్
వెలయెక్కు వంతకంతకు
బలువై వేవేలు దానిపైపైఁగూడన్. 18

ఒకతులము బరువుగల పద్మరాగము అఱువదినాలుగు వేల దీనారముల వెలచేయును. అంతకెక్కుడు బరువున్నచో నింక నెన్నియో వేల ధరచేయును. బరువెక్కుడగుకొలఁది వెలయెక్కుడగుచుండును.

క. సాంపెసఁగ సానఁబెట్టినఁ
బెంపగు తనమొదలికాంతి బెడఁబాసిన చూ
కెం పది కృత్రిమమణిరుచి
జొంపము గాని నిగుడునది యశుద్ధం బరయన్.

మణులకు సానఁబెట్టినకొలఁది మంచివన్నెవచ్చుట సహజగుణము. సానఁబెట్టినకొలఁది యటుల మెఱుఁగురాక కాంతి తొలఁగినచో నది కృత్రిమరత్నమని తెలిసికొనవలయును. అట్టి యపరిశుద్ధరత్నమును ధరింపఁదగదు.

క కురువిందము ధరియించిన
నరవిందహితుండు ప్రీతుఁడై యారోగ్యం
బొకవాంఛ నిచ్చు నెప్పుడు
సిరు లొంద సమస్తకార్యసిద్ధు లొసంగున్. 20

కురువిందమణిని ధరించినయెడల సూర్యభగవానుఁడు ప్రీతి నొంది ధరించినవాని కాయురారోగ్యములు సంపదలు కార్యసిద్ధులు చెడతెగనటుల నొసంగి కాపాడును.

## వజ్రములుపుట్టు స్థలములు.

సీ. మహిశైలమాతంగ మహితస్థలంబుల
నుదయించునవి కృతయుగమునందు
గురుతరకాశ్మీరకోసలోద్భవములై
కర మొప్పుఁ ద్రేతాయుగంబునందుఁ
బౌండ్రక సౌరాష్ట్ర భవ్యదేశములందుఁ
బ్రభవించి వెలుఁగు ద్వాపరమునందు
వైరాట సింధు విదూరదేశములందు
విలసిల్లుఁ గలియుగవేళ నిపుడు
తే. విమలవజ్రంబు లీరీతి క్రమము మెఱసి
నిజసముత్ఫుల్లకాంతుల నిఖిలదిశల
నిగుడి ధగధగ మెఱయుచు నిండి తపను
మండలప్రభ మార్కొని మెండు మెఱయు. 21

భూమియందును గొండలందును ఏనుఁగుల గండస్థలములందును కృతయుగమున వజ్రములు పుట్టుచుండెను. కాశ్మీరదేశమునఁ గోసలదేశమునను త్రేతాయుగమునఁ బుట్టుచుండెను. పౌండ్రసౌరాష్ట్రదేశములందు ద్వాపరమునందు వజ్రములు పుట్టుచుండెను. విరాటసింధువిదూరదేశములయందుఁ గలియుగములో వజ్రములు పుట్టుచున్నవి. వజ్రములు సహజములగు కాం

తితోనిండి దశదిశల వెలుఁగొంటఁజేయుచు సూర్యమండలమును
గూడ నెదిరించుకాంతితోఁ బ్రజ్వరిల్లుచు లోచనోత్సవముకలుఁ
గఁజేయును.

చ. అసమునఁ జూడకుండి కలికాకృతిఁ జెల్వగు విప్ర
జాతి పెం, పెసఁగెడు పల్లవంబుగతి నెఱ్ఱనిచా
యది భూపజాతి క్రొం, బసిమి తనర్చి కాంచన
ప్రభంగననొప్పగు వైశ్యజాతి యీ, వసుమతి నీల
కాంతిగలవజ్రము నాలవజాతి యై చనుఁ. 22

తేటిచూడరానంత కాంతిగలదియై మొగ్గవలెనుండి తెల్లఁగాఁ
దనరు వజ్రము బ్రాహ్మణజాతియనియుఁ జిగురుటాకువలెఁ గెం
జాయతోఁ గనుపట్టునది క్షత్రియజాతియనియుఁ బసిమిగలిగి
బంగారువన్నెగలది వైశ్యజాతియనియు నలుపువన్నెగలది
శూద్రజాతియనియు వజ్రముల కిటుల చాతుర్వర్ణ్యములు నిరూ
పింపఁబడెను.

క. తెలుపగువజ్రము సుకృతం
బలవడు కెంజాయవజ్ర మది వశ్యము శ్రీఁ
గలిగించుఁ బీతవజ్రము
నలుపగువజ్రంబు జనుల నాశము జేయుఁ. 23

తెలుపువన్నెగల బ్రాహ్మణవజ్రము పుణ్యములను, ఎఱుపురం
గుగల క్షత్రియవజ్రము వశీకరణమును, పచ్చనికాంతిగల వైశ్య
వజ్రము సంపదను గలుగఁజేయును. నలుపువన్నెగల శూద్ర
వజ్రము యజమానిని నాశనముజేయును.

క. రూపావని చులుకనై మెఱుఁ
గేపారఁగ వాఁడి బొరలు నెనిమిది సమమై
ాపకములాఱు నాత్రై
చూపట్టుట వజ్రమణికి శుద్ధగుణంబుల్. 24

మనోహరమగు నాకృతియు తేలికయుంగలిగి మెఱుఁగులు దేరుచు వాఁడిపలక లెనిమిదిగలిగి యాఱుకోణములు దేఱి యంచులు కోణములు సమముగానుండిన వజ్రము నిర్దోషమైనది పరిశుద్ధమైనదని చెప్పఁబడును.

ఆ. నడుమ నిడుపు నడ్డ నల్లని రేఖలు
గలిగెనేని యదియుఁగాక పదము
వలదు విడువ కిట్టి వజ్రంబుఁ దాల్చిన
జముఁడు దిట్టినట్లు చచ్చు నిజము. 25

వజ్రమునకు మధ్యభాగమున నిడుపు అడ్డముగల నల్లనిగీత లున్నయెడల నది కాకపదమని చెప్పఁబడును. అట్టి వజ్రమును విడిచిపెట్టవలయును. విడువక మూర్ఖించి ధరించినయెడల యమునిచేఁ దిట్టు దినినటులఁ జచ్చుట సత్యము.

ఆ వేఱుజాడ మెఱుఁగు వెలుఁగుట విచ్ఛాయ
వెలుఁగు లేకయుంట మలిన మగుట
పనరు కోణములును ధారలు లేకుంట
ముండ్ర మండ్రు దాని ముట్టరాదు. 26

సహజమగు కాంతితో వెలుఁగకుండుటయు వికారమగు వెలుఁగుతోనుంటయు ఎట్టికాంతిలేక యుంటయు మురికిగాఁ

గానవచ్చుటయుఁ గోణములు అంచులు లేకుంటయుఁ దట స్థించెనేని యట్టివజ్రమును ముంద్రమందురు. బాగుపడనెంచు వారు దానిని ముట్టుకొనరాదు.

ఉ. దాకటిమీఁదఁ బెట్టి బెడిదంబుగ సమ్మెటవేయ
భిన్నమై, పోకజలంబులో మునిఁగిపోవక యె
వ్వఁడు లోహపత్త్రికిఁ, జేకొని వ్రాయ రేఖ విల
సిల్లని వజ్రము శుద్ధ మిద్ధరఁ, బ్రాకటరీతిఁ
దాల్ప నట భర్గుఁ డొసంగు శుభంబు లెప్పుడున్.

దాకటిమీఁదఁ బెట్టి సమ్మెటతోఁ గొట్టినను బగులక, నీటి లోవైచిన మునిఁగిపోక, లోహపుఁ బనిముట్టులో రాచినఁ బైని గీటులుపడక యున్నవజ్రము పరిశుద్ధమైనది. దానిని ధరించు వారికి శివుఁడు సమస్తశుభంబు లొసంగును.

## పచ్చల పరీక్ష.

సీ. లలితమయూరకళావిస్ఫురణమున
వర్ణింప నొప్పు శైవాలరుచిని
భాసురంబుగ గాజుపచ్చతెఱంగున
రాజితదూర్వాంకురముఁ బసను
మెఱుఁగుడు పురుగు మే మెఱయుచందంబునఁ
గొమరు మించినపాల కొమ్మచాయ
జిగిదళుకొత్తు రాచిలుక తెక్కలవన్నె
పోలుపాఱు దిరిసెంపుఁ బువ్వువన్నె

తే. క్రాలు నెనిమిది తెలుఁగుల డాలు గలిగి
శకలదుర్మంత్రయంత్రహృజ్జ్వరశోక
ఘనతరోన్మాదమూర్ఛావికారపైత్య
హారణకారణ మగుశుద్ధమరకతంబు. 28

మరకతము (పచ్చ) నెమలిపించెము వన్నియవలెను, నాచువలెను, గాజుపచ్చ తెలుంగునను, గఱికి మొలకలరీతిని, మెఱుఁగుడుపురుగు మేని మిసిమిపోలికగను, పసిమి క్రక్కు పాలకొమ్మ పగిదిని, రామచిలుక ఱెక్కలచందమునను దిరిసెనపుఁబూవు వర్ణము భాతిని నాకుఁబచ్చవన్నెలకు నాటపట్టువై యుండును. అది ధరించినయెడల విరోధులమంత్రతంత్రములు పీడింపవు. గర్భశోకము పిచ్చి, మూర్ఛ, చిత్తభ్రమ, పైత్యము లోనగు వ్యాధు లడంగును.

క. ఈరత్నమునకుఁ బుప్పియుఁ
గారయుఁ గర్కశ మనంగఁ గసురులు మూఁడే
పాపనవి యెల్లఁ దెలియక
వారక ధరియింప జగతి వల దెవ్వరికిన్. 29

మరకతములకు (పచ్చలకు) సాధారణముగఁ బుప్పి, కార, కర్కశము అను మూఁడుదోషము లుండుటగలదు. వానిని విచారింపక దోషయుతములగు పచ్చలను ధరించుట యెంతవానికేని దగదు.

## మరకతదోషవివరణము

తే. పుప్పియుండ్రమున్నఁ బుచ్చిన తొరటది
సూదిపోటటండ్రు సున్నయండ్రు
కప్పినట్లు తోఁచు గారయె కర్కశ
పచ్చమీఁద గచ్చు రచ్చ లగుట 30

పుప్పియనుదోషము తొరటగానుండుట, సూదిపోటువలె నుండుట, సున్నవలెఁ గానవచ్చుటవలనను, గార యనుదోషముపైని యేదో కప్పువేసినటులఁ గనఁబడుటవలనను, కర్కశమను దోషముపైభాగమున గచ్చుచేసినటులఁ గనఁబడుటవలనను మరకతములను బరీక్షించి తెలిసికొనవలెను.

క. దినకరున కెదురు బెట్టిన
ఘనముగ నిరుదెసల నిగుడు కాంతులు నెచ్చో
కనకమణి ఘటపటాదులఁ
దనవన్నెకుఁ దెచ్చు మరకతము శుద్ధ మిలన్.31

మంచిదగుమరకతము సూర్యున కెదురుగాఁ బెట్టినయెడల దట్టముగా నిరుదెసలయందును గాంతులను వెదజల్లును. బంగారును, వజ్రమును, కుండను, వస్త్రమును సంపర్కవిశేషముచేఁ దనవన్నియకుఁ దెచ్చును. ఇదియే పచ్చయెడఁ గలమంచితనము నెఱుంగనగుమార్గము.

క. అరుదుగ సున్నముపై నిడఁ
దరుణారుణకిరణకాంతి దనరుచు నున్నపై

పరగినపచ్చలతోలకును
ఘనముగఁ జొప్పడి వేలదీనారంబుల్. 32

పచ్చపై దట్టముగా సున్నముబూసినను తనకాంతిసమూహమును సున్నములో నుండి భేదించి రక్తవర్ణముగల సూర్యబింబమువలెఁ బ్రకాశించినయెడల నది పరిశుద్ధమైనది. దాని విలువ అఱువదినాలుగు వేల దీనారములగును.

క. విషముడిగు దృష్టిదోషం
బెసఁగదు బుధబలముగలుగఁ బెసఁగుఁ బ్రీతిన్
వసుధామరునకు నొసఁగిన
వసగలపుణ్యంబు గలుగు పచ్చధరింపన్. 33

మరకతము ధరించినయెడల విషప్రయోగ మంటదు. దృష్టిదోషము దాఁకదు. బుధబలమువలన ప్రియము కలుగుచుండును. బ్రాహ్మణునకుఁ బచ్చదానము గావించినయెడల దాతకు బ్రాహ్మణుఁడు పచ్చ దాల్చినదిమొద లమితపుణ్యము కలుగును.

## ముత్యములపరీక్ష.

క. ప్రవిమలనిజనిర్మలరుచి
నవిరళనక్షత్రశ్రీ నాక్షేపింపన్
దివి రెడుముక్తాఫలములు
నవవిధములు వానిఁగ్రమమునన్ వివరింతున్. 34

మంచిప్రకాశముగల ముత్యములు నక్షత్రములకాంతిని బరి

హాసింపఁదగినంతకాంతి గలవిగానుండును. ముత్యములలోఁ దొమ్మిదితెగలు గలవు. వానివాని విశేషములు వరుసగాఁ జెప్పఁబోవుచున్నాఁడను.

క. జలధరఫణివేణకీచక
జలచరకరిమస్తకేశుశంఖవరాహో
జ్జ్వలదంష్ట్రాశుక్తు లువరం
బుల ముత్యము లొదవు వర్ణములు వివిధములై.

మేఘములయందును, పాము పడగలందును, వెదురునందును, చేఁపతలలయందును, ఏనుఁగుకుంభస్థలములందును, చెఱకుగడలందును, శంఖములందును, వరాహములకోఱలయందును, ముత్యపుచిప్పలలోపలను వివిధములగు రంగులుగలముత్యములు పుట్టుచుండును.

ఉ. నీరదముల్ దిగంతములు నిండి పటుస్ఫుటగర్జితం
బు లేఁ, పార మహోగ్రవృష్టి గురియన్ బ్రభ
వించు నితాంతకాంతితోఁ, నారయ కుక్కుటాం
డసమమై పడుముత్యము లంతరిక్షసం, చారులు
పట్టుకొందురు వసుధన్ బడకుండఁగ నేర్పు
పెంపునన్. 36

మేఘము లాకాశమునంతయు నావరించి దిక్కులు మాఱు మ్రోఁగునటుల నుఱిమి మిక్కుటముగా వానలుగురియు సమయమునందుఁ గనులు మిఱుమిట్లుగొలుపుకాంతితోఁ గోడిగ్రుడ్డంతపరిమాణముగలముత్యములు పడుచుండును. వానినంతరిక్ష

సంచారులగు దేవతలు నేలపైఁ బడకుండ నేరుపుగాఁబట్టుకొని యలంకరించుకొనుచుందురు.

క. ఉరగము తల విలసిల్లెడు
పరమౌక్తిక మఖిల విషనివారక మదియుఁ
గురువిందగింజచాయను
నరుణంబై ధర నలభ్య మై రాజిల్లుఁ. 37

పాములపడగలపై నున్నముత్తెములు మిగులశ్రేష్ఠములైనవి. వానిని ధరించినయెడల సమస్తవిధములగు విషములు నివారించును. అది గురుగింజచాయగా నెఱ్ఱగా నుండును. మానవుల కాముత్య మెన్నటికిని లభ్యముకాదు.

క. విదితముగ బొంగు వెదురున
నొదవిన మౌక్తికము తారకోజ్జ్వలము శుభ
ప్రదము వనితావశీకర
మదిమాషఫలప్రమాణ మై భాసిల్లుఁ. 38

వెదురునందు జనించుముత్యము నక్షత్రమువలెఁ బ్రకాశవంతముగా నుండును. దానిని ధరించినయెడల శుభములు కలుగును. స్త్రీలు వశమై వలచి యేతెంతురు. వెదురులోఁబుట్టు ముత్యము మినపగింజయంతదిగా నుండును.

క. కలధౌతధవళమల్లిక
కలికాకృతిఁ దెలుపు గలిగి కడురమ్యంబై
వెలుఁగొందు గండుమీనము
తలనుండును ముత్య మగ్ని దాఁకదు దానిఁ. 39

మల్లెమొగ్గవలెఁ దెల్లనికాంతిగలదైన ముత్యము చేఁపల తలలయందు జనించును. అది మిగులఁ బ్రకాశించుచు నుండును. దానిని ధరించినయెడల నగ్నిభయము కలుగఁజాలదు.

క. పరిపక్వామలక ఫల
స్ఫురణం బేసారి వెలుఁగుఁజూపుచు నుండుక్
గరికుంభ సంభవం బగు
నురుతర మగునదియు రాజయోగ్యం బగుచున్.

బాగుగాఁబండిన యుసిరిక కాయయంత యురువుగలదై ప్రకాశవంతమై యేనుఁగుల కుంభస్థములలోఁబుట్టు ముత్యము వెలుఁగొందుచుండును. ఆగొప్పముత్యమును ధరింపఁదగినవారలు రాజులు. అది రాజయోగ్యమైనది.

ఆ. వెదురుచెఱకునందు విఁసిల్లు ముత్యంబు
పాదలుప్రేంకణంపుఁ బూవుచాయ
నది సమస్తభూత లాఘేశకామినీ
వశ్యకరము ధరణి వలయమునను 41

వెదురుచెఱకుగడలలో జనించుముత్యము ప్రకాశవంతమై ప్రేంఖణపుఁబూవు (ప్రియాళుసుమము) వన్నెతో నొప్పారుచుండును. అది రాజవశీకరణము కామినీవశీకరణమునయి భూలోకమున మిగులఁ బ్రసిద్ధివహించియున్నది.

ఆ. పందికొమ్మునందుఁ బ్రభవించుముత్యంబు
బదరిఫలమురీతి భాతిగలుగు
కొమరు మిగులుచుండుఁ గుంకుమప్రభ నది
మహి దనర్చు రాజ మకుటములను. 42

పందులకోఱలయందు జనించు ముత్యము రేఁగుపండ్లంత ప్రమాణము గలిగియుండును. కుంకుమపూవువన్నెతో నది మిగుల నెఱ్ఱగా నుండును. రాజులకిరీటములయం దది విరాజమానముగా నొప్పారును.

క. వరశంఖజనితమౌక్తిక
మరయఁ గపోతాండభాతి నత్యుజ్జ్వలమై
పరగునది మంత్రసాధన
పరులకుఁ దక్కంగ దుర్లభం బితరులకున్. 43

శంఖములలో జనియించుముత్యము పావురము (గువ్వ) గ్రుడ్డువలె మెఱయుచునుండును. అది మంత్రసాధనపరులగు వారలకుఁదక్క నితరులకు లభింపదు.

ఆ. చిప్పగనులు మూఁడు శృంగళరావణ
తామ్రపర్ణులందుఁ దనరుచుండు
వరుస నసుభలోని వ్యవహారములకును
వచ్చుఁ దామ్రపర్ణిలను మణులు. 44

ముత్యపుఁజిప్పలు మూఁడువిధముల నొప్పుచుండును. శృంగళము, రావణము, తామ్రపర్ణి యని చెప్పుదురు. వ్యవహారములయందు విశేషముగా నుపయోగింపఁబడుముత్యములు తామ్రపర్ణియను ముత్యపుఁజిప్పలో జనించునవై యున్నవి.

క. శృంగళపుశుక్తిముత్యము
రంగుగఁ గెంజాయ నమరు రావణశుక్తిన్

బొంగారు మౌ_క్తికంబులు
బంగారమువన్నె శాస్త్రపద్ధతి నమరుఁ౽ 45

శృంగళమను ముత్యపుఁజిప్పలయందుఁ బుట్టుముత్యములు ఎఱ్ఱనిరంగుతోఁ దనరును. రావణశు_క్తియందు జనించు ముత్యములు బంగారమువంటి మిసిమిగలవై శాస్త్రానుకూల ములగు లక్షణములతో నలరారుచుండును.

క. కప్పఁగు చున్ననున్న ని
చిప్పలలో స్వాతివాన చినుకులు మున్నే
చొప్పునఁ బడు నప్పరుసున
నొప్పావఫుమ మౌ_క్తికంబు లొక్కొకభంగిఁ౽.

కప్పఁగొనియున్న ముత్యపుఁజిప్పలలో స్వాతి వానచిను కులు ఏవిధముగాఁ బడునో యావిధముగానే ముత్యములు పరిమాణభేదములతోఁబుట్టి యలరారుచుండును. ముత్యములు వానిపరిమాణములనుగూర్చి చెప్పుచున్నాఁడు.

ఆ. జమిలిచినుకు బడిన నమడముత్యం బగుఁ
దొడ్డచినుకుబడిన తోరమైన
ముత్యమై తనర్చు మునుకొని చినుకులు
చెదరిపడిన మణులు చిన్నవగును. 47

ముత్యపుఁజిప్పలలో జమిలిచినుకులు పడినయెడలఁ గవల ముత్యములు జనించును. పెద్దచినుకు పడినయెడల బెద్దదియగు ముత్య మేర్పడును. చినుకు చెదరిపడినచో ముత్యపుఁజిప్పల యందుఁ జిన్నచిన్నముత్యము లేర్పడును.

చ. నడుమ కసరింత లేక మలినంబులు [illegible] గూడక... లోనఁ
క్రిందుగాఁ, బుడుపులు బొక్కలు కొక్కులొరిగిపోవక
విప్పును గ్రొమ్మెఱుంగునొ, ప్పెపుడు [illegible]
బడినవే ఘనతోయకణంబు ముత్యమై [illegible]
ననర్ఘ్యరత్నమై మనఁ బొల్చు సముజ్జ్వలకాంతి
చంద్రికన్. 48

మధ్యభాగమున వ్యత్యస్తములు లేక, నడుమ మఱికిమచ్చలు లేక లోపలను క్రిందను బుడుపులు లేక, అంచులు ఒరిగిపోక మంచియురువు గలిగి ప్రకాశవంతమగు ముత్యము, ముత్యపుఁ జిప్పలో ధారాళముగాఁ బడిన వానచినుకువలన జనించును. అది మంచి ప్రకాశము గలిగి యింతయని విలువ నిర్ణయింప రానిదై ప్రసిద్ధినొందును.

వ. అట్టి ముక్తాఫలంబులకు నాణియు, సుతారంబును, సుపాణియు ననుగుణంబులు మూఁడు
ఉత్పన్న దృశ్యంబులు, పార్శ్వకృతంబును, త్రివృత్తంబును, కాకపాణియు, వికటపీఠంబును, జాఠరంబును, అతిరక్తంబును, ధూమ్రాకంబును, మత్స్యాక్షియు, శుక్తికాస్పర్శనంబును, రజంబు ననుదోషంబులు [illegible]
యం గొలంగించెద. 49

శుక్తిభవంబులగు నాముత్యంబుల యాకారవిశేషంబులను బట్టి ఆణియనియు సుతారమనియు [illegible]

భేదము ఉత్పత్తినిబట్టి కనుపించును. ఈముత్యములకుఁ బైని పేర్కొనినవిధముగాఁ బదిదోషములు గలవు. దానివివరము నెఱింగించుచున్నాఁడను.

క. అఱలేక చుక్కతెఱఁగున
మెఱయు సుతారంబు మేలిమిని పత్రువయై
మెఱుఁగొందు నాణి ఘనమై
నెఱయును సుహాణి యెపుడు నిర్మలకాంతిన్.

కళంకములేక చుక్కవలెఁ బ్రకాశించుముత్యము సుహాణి యనఁబడును. మేలిమికాంతిగలిగి గుండ్రముగా నుండుముత్యము ఆణి యనఁబడును. పెద్దదియై ప్రకాశించుచు నిర్మలముగా నుండుముత్యము సుహాణి యనఁబడును.

సీ. మూఁడుమూలలు గలముత్యంబు దృశ్యంబు
ప్రక్కగుంత లసితము పార్శ్వవక్రశమము
పొరలు పై మూఁడున్న నరయఁ ద్రివృత్తంబు
ఘననీలవర్ణంబు కాకపాణి
వికటపీఠంబులు విలసిల్లు బుడుపులు
జాగుడై జిగిచెడ్డ జాఠరంబు
అతిరక్త మనుదోష మది విద్రుమచ్ఛాయ
ధూమ్రాంక మనునది ధూమకాంతి
ఆ. మౌక్తికంబు నడుమ మత్స్యాక్షి యనునది
గానవచ్చు మీను కన్నుబోలె

చిప్పరజము కడలఁ జిక్కి నశుక్తికా
స్పర్శ మండ్రు రత్నశాస్త్రవిదులు. 51

మూఁడుమూలలు దీరినముత్యము దృశ్య మనఁబడును. ప్రక్కన నొక్కులుగలది పార్శ్వకృశము. పైనిపొరలు దేరియున్నయెడఁ త్రివృత్తము. మిగుల దట్టమగు నీలకాంతితో నున్న కాకపాణి. అందందు బుడుపులు దీఱియున్న వికటపీఠము. నడుమ మిటికిదనము గానుపించిన జాఠరము. మిగుల నెఱ్ఱగా నున్నయెడల విద్రుమము. పొగవంటి మైలరంగుతో నున్న ధూమ్రాంకము. నడుమ చేఁపకంటివలెఁ గళంకము కానిపించినయెడల మత్స్యాక్షి, చిప్పకు గఱచికొనియున్న రజము, ముత్యపుఁజిప్ప యంచులకుఁ గలసికొని లాగిన రాకున్న శుక్తికాస్పర్శ మని మౌక్తికదోషములు చెప్పఁబడుచున్నవి.

క. సలవణగోమూత్రములోఁ
బలుమఱు నిడి యూఁకఁ దోమఁ బగిలినముత్యం
బులు కృత్రిమములు మించుం
మొఁకలపై నెత్తు ముత్యములు సహజంబుల్.

గోమూత్రములోఁ గొంచెము లవణమువేసి యందు ముత్యములుంచి వరియూఁకతో బాగుగాఁ దోమినయెడలఁ బగిలిపోయినముత్యములు కృత్రిమములైనవి. పగులకుండ మెఱుపువలెఁ గ్రొత్తనిగ్గులతోఁ బ్రకాశించుముత్యములు సహజములు.

చ. సలలితసద్గుణత్రయవిశాలములై నుతికెక్కి
దోషముల్, గలుగక దేనెచాయఁ గనకద్యుతి

నుజ్జ్వలకాంతితోడఁ జెన్నలరుచు నున్నమౌ_క్తి
కము లర్థి ధరింపుచు నున్ననాయువృక్ష, దళి
ముగఁ జంద్రుఁ డెంతయు ముదంబున నిచ్చుఫ
లంబు లన్నియుక్ష. 53

పూర్వము చెప్పినసుతారము, ఆణి, సుపాణి యను మూఁడు తెగలుగల ముత్యములు పైనిఁజెప్పిన పదితెఱంగులదోషములు కలిగియుండక తేనెవంటి చాయతోనైనను, బంగారువంటి పచ్చనికాంతితోనైనను ఒప్పుచున్న యెడల ధరింపయోగ్యములు. అట్టి ముత్యములు దాల్చినవారికిఁ జిరాయురారోగ్యఫలములు చంద్రుఁడు ప్రసాదించును.

నీ ల ము ల ల క్ష ణ ము.

ఆ. మొదల నింద్రనీలమును మహానీలంబు
నీలమణి యనంగ నిఖిలదిశల
వినుతికెక్కు మూఁడువిధముల నొప్పెడు
రంగుఁ గలుగు నీలరత్నమునను. 54

ఇంద్రనీలము, మహానీలము, నీలమణి యని నీలరత్నములు మూఁడువిధములుగా నుండును. మూఁడు తెగలనీలములుమూఁడు విధము లగుకాంతితోఁ బ్రకాశించుచుండును. వానికాంతివిశే షములు తెలుపుచున్నాఁడను.

క. నెఱిరంగు నింద్రనీలము
నెఱీనించు మయూరకంఠ నీలప్రభతో

మెఱయునది దేవయోగ్యము
వరలఁగ నింద్రునకుఁ గలుగ వైభవ మెసఁగెన్.

ఇంద్రనీలము తలవెంట్రుకలవలెను, నెమలికంఠమువలెను నీలకాంతితోఁ బ్రకాశించుచుండును. అది దేవతలు ధరింపఁ దగినది. ఇంద్రుఁ డానీలమును ధరించుటవల్లనే మిగుల వైభవశాలియై ప్రసిద్ధి నార్జింపఁగలిగెను.

క. ఒప్పునది వెన్ను వెదురిక
పుష్పము వన్నియను దెచ్చుభువి నిడియున్నన్
ముప్పాతికరంగమ్మున
నొప్పు మహానీలమతి శుభోన్నతి నిచ్చున్. 56

మహానీలము నేలపై నుంచినయెడల నాప్రదేశమునంతయును వెన్నుఁగల వెదురువలెఁ బచ్చనగుటయుఁ బూవువలెఁ బ్రకాశవంతమైయుండుటయు సహజగుణము. మూఁడుపాళ్లనీలకాంతితో మహానీలము వెలుంగుచు ధరించినవానికి శుభప్రదముగాఁ దనరారును.

క. నీలమణి యర్థపంగము
వేలకు మనఁజేయుఁ గృష్ణవిష్ణుక్రాంత
శ్రీలాలిత నసుమరుచిఁ
బోలిన నునుడాలు గలిగి భూనుత మగుచున్.

నీలమణి నగము నీలవర్ణముగలిగి వేలకువేలు ధరచేయు నదియై కృష్ణవిష్ణుక్రాంతపుష్పమువలెఁ బ్రకాశవంతమై మనో

హారమగు కాంతితోఁ బ్రజాసంస్తుతిపాత్రమై యొప్పారు చుండును.

వ. మఱియు నీలంబునకుఁ ద్రాస, భిన్న, పటల,
పాషాణగర్భ, మృద్గర్భ, రక్తబిందువు లనెడి
యాఱుదోషంబులు గలనవి యెట్టి వనిన. 58

నీలమునకుఁ బైని పేర్కొనఁబడిన ఆఱువిధములగు దోషము లుగలవు. వానివివరములు తెలుపుచున్నాఁడను.

చ. పగిలినరేఖరీతిఁ గనుపట్టుచు నుండును ద్రాస
మెప్పుడుఁ, జగడము పోరుగల్గు, మఱి చయ్యన
బంధులఁ ద్రుంచు తిన్నఁగాఁ, జిగి నిరసించు భిన్న
మది చిద్రుపయాపటలంబు శోకముఁ, వగ
పును బొందఁజేయునది వారక దాల్చిన నెంత
వారికిఁ. 59

పగిలినగీతరీతిగాఁ గనుపట్టుట త్రాసమనఁబడును. దానిని దాల్చినవారికి యుద్ధములు తగవులు బంధునాశనము కలుగు చుండును. భిన్నమనుదోషము మణికిఁ గలనైజకాంతిని దొలం గించును. పగుళ్లు కానవచ్చుట పటలమనఁబడును. ఇట్టిదోషము గల నీలమును ధరించినయెడల నెంతవారికేని విచారము శ్రమ యు సంతాపము కలుగును.

క. పాషాణగర్భ మనియెడు
దోషము నీలమున నిసుకతోఁచుట దానిం

భూషణయోగ్యము గా దని
దూషింతురు సుతులఁ జంపు దుర్మణి యగుటన్.

నీలమునం దిసుకరాల్చినటులఁ గానవచ్చుట పాషాణగర్భ
మనుదోషము. అట్టి నీలమును ధరింపరాదని రత్నశాస్త్రవిదులు
చెప్పుచున్నారు. సాహసించి ధరించినయెడల నాదుర్మణిదోషము
వలన ధరించినవానిసుతులు గతింతురు.

క. విదితముగ నీలమణిలో
మృదువగు మన్నున్న నదియె మృద్గర్భ మగున్
ముదమునఁ బూనినమానవుఁ
గదియుఞ్ వెత ప్రాణబాధ కలుగుచు నుండున్.

నీలమణియొక్క లోపలిభాగమున మన్నున్నటుల గానవ
చ్చినయెడల నది మృద్గర్భ మనఁబడును. ఆట్టి మృద్గర్భదోష
ముగల నీలమును ధరించినవానికి ఆపదలు సంభవించుటయేగాక
ప్రాణాపాయముగూడ కలుగుచుండును.

క. నెట్టన మణిపై నెత్తురు
బెట్టిన యట్లున్న రక్తబిందువు కానన్
బట్టను, దాని ధరించిన
మట్టం జేడాదిలోన మరణం బొందున్. 62

నీలముపై నెత్తురుబొట్టు పెట్టినటుల నెఱ్ఱనిమచ్చయున్న
రక్తబిందు వనఁబడును. దానిని నెవ్వరును ధరింపఁదగదు. అది
ధరించినయెడల సంవత్సరము పూర్తియగులోపలఁ దాల్చిన
వాఁడు మరణము నొందును.

వ. మఱియు సామాన్యదోషంబు లెట్టి వనిన, మలి
న, విచ్ఛాయ, కుక్షిర, కరంజి, వాలుకాస్పర్జ
నంబు లన నైదుదోషంబులు గల వందు. 63

పూర్వోక్తదోషములుగాక నీలములకుఁ బైనిచెప్పిన యైదు విధముల సామాన్యదోషములుగలవు. వానివివరములు చెప్పుచున్నాఁడను.

క. తనజాడ మెఱుఁగు వెలుఁగును
చనరక మలినంబు వెలయుఁ దనకాంతివెలుం
గని మణివిచ్ఛాయయు మే
జని దీనిని విడచుచుండ్రు ధీయుతు లెల్లన్. 64

సహజమగు మెఱుఁగు ప్రకాశములేక యుండుట మలిన మనఁబడును. తన సహజకాంతివిడచి వేఱొకరీతిగాఁ బ్రకాశించుట విచ్ఛాయ మనఁబడును. ఇట్టి దోషములుగల మణిని విద్యావిదులగువారు విడచిపెట్టుచుందురు.

క. చేత నిడి చూడ నడుగున
ఖ్యాతిగ రేఖలను దెలిసి కాంతియుఁ దెలుపై
యాతఁడ దోఁచెడి నీలము .
భూతలమునఁ గుక్షి దానిఁ బూనరు తద్జ్ఞుల్.

చేతులోఁబెట్టుకొని చూచినయెడల నడుగుననుండి చేతిరేఖలు గానవచ్చుచు వెలవెలఁబోవుచున్న తెలుపురంగుగల నీలమునం గనవచ్చుదోషము కుక్షి యనఁబడును. దానిని రత్నదోషము లెఱింగినవారు ధరింపరు.

ఆ. కరతలమున నుంచి కనుఁగొన్న నల్లని
యుపలగింజపలెను నుండెనేని
వెలయు నెత్తిమీఁద నిల నొక్కచోటను
గలుగునదె కరంజి కలహకారి. 65

చేతిలోనుంచికొని నీలమునఁ జూచినయెడల నడుగునఁ గాని పైనిగాని ఉలవగింజపోలికగల గురుతు గానవచ్చెనేని యాదోషము కరంజి యనఁబడును. అట్టికరంజిదోషముగల నీలమును దాల్చినయెడఁ గలహములు కలుగుచుండును.

ఆ. ఏటినీటివంటి నెరసులు గలిగియు
మహిని వెలయు నీలమణియు నైదు
వాలుకాస్పర్శనా వఱలుచు నున్నట్టి
దాని బూన మేలు తలఁగిపోవు. 66

ఏటినీటివలె హెచ్చుతగ్గులు నెరసులుగలిగియున్న నీలదోషము వాలుకాస్పర్శ మనఁబడును. ఇది యైదవదోషము. ఈదోషముగల మణిని ధరించినవానికి మే లెన్నఁడును గలుగఁజాలదు.

క. సారం బగునీలము గో
క్షీరంబుల నిడఁగ నదియుఁ గృష్ణము నైనన్
క్షీరగ్రాహి యనంబడు
నారత్నోత్తమము దాల్ప నమరుల కమరున్.

ప్రశస్తమగునీలమును ఆవుపాలలో నుంచినయెడలఁ బాల న్నియు నీలవర్ణమును బొందును. అట్టినీలమును క్షీరగ్రాహియని

యందురు. ఆయుత్తమరత్నమును ధరించుభాగ్యము దేవతలకు మాత్రమె సమకూరునుగాని నరులకు సమకూరదు.

క. కసవును సొరగును గసమును
నెసఁగఁగ నీలంబుమీఁద నిడి యూఁదంగన్
వెస నెగసిపోక నిలిచిన
వసుధఁ దృణగ్రాహి యనఁగవచ్చును దానిన్.

కసవు, ధాన్యములపొట్టు, గసగసాలు లోనగునవి నీలముపై నుంచి యూఁదినయెడల నవి పైకెగిరిపోవక యున్నయెడల నట్టినీలమును దృణగ్రాహి యని యందురు.

తే. వేలె యఱువదినాలుగు మేలుమాడ
నింద్రనీలమణికిఁ దుల మెత్తునకును
నెఱయఁ బదివేలు మఱి మహానీలమునకు
నీరు నీ లాలకును వెల యాఱువేలు. 69

ఇంద్రనీలము తులముబరు వున్నయెడల అఱువదినాలుగు వేల మాడల విలువచేయును. మహానీలము తులముబరువు పదివేల మాడల విలువచేయును. నీలము (నీరునీలము) తులముబరు వున్న యెడల నాఱువేలమాడల విలువచేయును.

క. లాలిత విశుద్ధదీప్తులఁ
గ్రాలెడు నీలంబు లొప్పుగా ధరియింపన్
బోలగు సంపద లొసఁగును
మేలొసఁగుశనైశ్చరుండుమృత్యువుతొలఁగున్.

మనోహరమును నిర్మలము నగుకాంతితోఁ బ్రకాశించు నీలమును ధరించువానికి సాటిలేని యైశ్వర్యములను మేలులను నీలముల కధిదైవతమగు శనైశ్చరుఁడొసంగి యకాలమృత్యు భయమునుండి తొలఁగించి ధరించినవారలఁ గాపాడును.

వై డూ ర్య ము.

ఆ. పగలు గొందిఁ గానఁబడిన బిడాలంపుఁ
గన్నువోలె వెలుఁగు గలిగి నూలు
తిరిగి నట్టుమీఁది తెలుపారు వైడూర్య
రత్నమున కతిప్రయత్నమునను. 71

పగటిపూఁట చీఁకటిగొందిలోనున్న పిల్లికన్నులవలెఁ బ్రకాశించుచుఁ బైభాగమున నూలుదారములు త్రిప్పినటులఁ దెలుపు పోలికలు కానవచ్చినరత్నమును వైడూర్యమని యందురు. అది మిగులఁ బ్రయత్నముచేసినఁగాని లభింపదు.

ఉ. చేత ధరింప మానవులచెంతను జేరవు భూతకో
టు లే, రీతుల దుష్టవిద్య లొనరించిన నెక్కు-వు
కోరి జీవముల్, ఘాతలు సేయ నోడు పతిగ
ర్భము నొవ్వ సుఖప్రసూతియగు, నాతికి బ్రాఁ
తిగాఁ బ్రతిదినంబును బ్రీతి యొనర్చుఁ గేతువుల్.

కష్టతరలభ్యమైన యీవైడూర్యమును జేతధరించినవానికి భూతప్రేతపిశాచాదులవలనిభయము లుండవు. ఇంతియగాక ప్రయోగాదు లపాయముఁ జేయవు. విరోధులు ప్రాణాపాయ

ముచేయ నెంచి కొట్టినను అపాయముకలుగదు. ఆ(డు)వాం(డు)
వైడూర్యము ధరించిరేని సుఖప్రసూతి యగుదురు. వైడూర్య
మును ధరించినస్త్రీకిఁ దదధిదేవతయగు కేతువు ఉత్సాహము
కలిగించును.

పు ష్య రా గ ము.

క. మకరందబిందుసమరుచిఁ
ప్రకటంబుగఁ బుష్యరాగరత్నము బృందా
రకనికరాచార్యప్రియ
సుకృతశ్రీ యొసఁగి నరులఁ జూచు ధరిత్రిన్.

పుష్యరాగము తేనెబొట్టువలె (మరందబిందువువలె) ప్రకా
శించుచుండును. దాని కధిదేవత బృహస్పతి. పుష్యరాగమును
ధరించినమానవులకు బృహస్పతి సమస్తైశ్వర్యముల నొసంగి
కాపాడును.

గో మే ధి క ము.

క. గోమేధికమణినిర్మల
గోమూత్రచ్ఛాయఁ జాలఁ గొమరై మేనన్
ప్రేమ ధరింపఁగ సురుజయ
ధామం బగునిఖిలసౌఖ్యదాయక మగుచున్.

గోమేధికము పరిశుభ్రమగు గోమూత్రవర్ణముగలిగి మనోహ
రమగుకాంతితోఁ ప్రజ్వరిల్లుచుండును. దానిని ధరించినవార
లకు సమస్తములగు జయములును సర్వసౌఖ్యములును గలుగును.
ఇది గోమేధికలక్షణము.

పగడములు.

క. ధారుణిపై సింహళమున
వారిధిప్రాంతను బ్రవాళవల్లిక లుదయం
బై రాజిల్లుచునుండును
వారకదోషములు నాల్గు వానికిఁ గల్గున్. 75

సింహళద్వీపమునందును సముద్రతీరప్రదేశములయందునుపగడపుందీవ లుదయించును. పగడములకు సామాన్యముగ నాలుగు విధములగు దోషములు గలవు. వానిని వివరించెదను.

వ. మఱియు జర్ఝరంబును గోమలంబును పుప్పియు వనంబడు నాల్గుదోషములు గలవు. అవి వివరించెద. 76

పగడములకుఁ బైనిజెప్పఁబడిన దోషములు నాలుగుగలవు. ఆదోషస్వరూపములను వివరముగాఁ జెప్పుచున్నాఁడను.

చ. బుడుపులు గల్గు జర్ఝరము ఘూనినఁ బ్రాణము
తత్తరించు లే,మిడి నొదవించు వేదనలుమీఱఁగ
గోమలనామవిద్రుమం, బెడపక దుఃఖమా మ
లిన మేర్పడఁ దాల్చినఁ బుప్పి చేకొనన్, గడఁక
ను రోగసంకటము గల్గు ధరించిన మర్త్యకో
టికిన్. 77

పగడమునకు బుడుపులున్నయెడల నాదోషము జర్ఝరమనఁబడును. దానిని దాల్చినవారలు మరణింతురు. నడుమ గోమయ

మువంటి మరకలున్న యెడ గోమల మనుదోష మందురు. దానిని ధరించిన దరిద్రము బాధలు కలుగును. మఱికి మధ్యగానవచ్చు పగడమున మలిన మనుదోష ముండును. దానిని ధరించినవానికి విచారములు కలుగును పుప్పిగోసిన పగడమును ధరించినమానవు లకు రోగబాధలు కలుగునుగావున మానవుఁడు ప్రవాళదోష ములు గమనించి ధరింపవలెను.

సీ. దొండపండుఫలచ్చాయతో మచ్చరించుచు
 ను స్తిపండులరీతి నుబ్బణంచి
పరికింప నరిపండ్లఁ బకపక నగఁజేసి
 దేవదారులపండ్ల తేజమణఁచి
వటఫలకాంతిని వదలించి చెలరేఁగి
 బింబాధరులమోవి బిట్టుసంచి
శుకతుండములశోభ సొమ్మసిల్లఁగఁజేసి
 చందనకాష్ఠపుఁ జాయఁ దిట్టి
తే. మెఱసి నిద్దంపుఁగెంపులఁ మీగులఁ గదిసి
 కోరి ధరియించువారికిఁ గొఱతలేక
సర్వసౌభాగ్యయోగ్యప్రశస్తవస్తు
 భద్రకారణసంసిద్ధి విద్రుమంబు. 78

సహజముగాఁ బగడమునకు దొండపండువంటియు ఉసిడి పండువంటియు అరఁటిపండ్లవంటియు దేవదారుపండ్లవంటియుఁ మఱ్ఱిపండ్లవంటియుఁ జిగురుఁబోఁడుల కెంబెదవులవంటియుఁ జిలుకముక్కులవంటియుఁ రక్తగంధపుఁ జెక్కవంటియుఁ గెం

పులవంటియుఁ గెంజాయ కలిగియుండును. అట్టిపగడమును ధరించువారలకు సమస్తశుభములు సర్వసౌభాగ్యములు యోగ్య సమృద్ధియుఁ గలుగును.

క. సురుచిరవిద్రుమరత్నము
ధరణిజులకు యోగ్యకరము ధాత్రి జనవశీ
కర మగువనితలకు మనో
హారము జయప్రదము ప్రమదమౌ ధరింపన్.

ప్రకాశవంతమగు పగడము ప్రజలకు ధరింపఁదగినది. సమస్తజనవశీకరణమైనది. స్త్రీజనమునకు హృదయవశీకరమైనది. ప్రజ లుత్సాహవంతులై పగడములను ధరింతురేని సర్వవిధములగు జయములు కలుగును.

రత్నపరీక్ష సమాప్తము

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1925.

# జ్యోతిషగ్రంథములు.

ప్రతి 1-

ఆరూఢరత్నసిద్ధాంజనము
కాలామృతము, సటీక, మేలుప్రతి
గోళిశాస్త్రము, తెనుఁగు
జలార్గళశాస్త్రము, సటీక
ముహూర్తదర్పణము, సటీక
నక్షత్రచూడామణి, చక్కనిప్రతి
సర్వార్థచింతామణి, మేలుప్రతి
లఘుజాతకము, సాంధ్రతాత్పర్యము
భృగుసూత్రములు ,,
భావార్థచంద్రిక ,,
వృద్ధపరాశరము ,,
కేరళప్రశ్నము ,,
సనత్కుమారగృహవాస్తువు ,,
మయవాస్తువు ,,
వాస్తుసర్వస్వము ,,
వనమాల (వర్షఫణి) ,,
స్వప్నశాస్త్రము ,,
సాముద్రికశాస్త్రము, సటీక
అష్టకవర్గు, సాంధ్రతాత్పర్యము
శకునశాస్త్రము, (శిఖనరసింహశతకము)
సారావళి, సాంధ్రతాత్పర్యము

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అ
292, ఎస్ప్లనేడ్,